# కాంగ్రెసుసత్యాగ్రహము

ఫిబ్రవరి ౧౯వ తేదిమధ్యాహ్నం ౧-౨గంటలకు కేంద్రగ్రామంలో శ్రీమల్లుల సాంభమూర్తిగారు సత్యాగ్రహముచేసినారు- కాని పోలీసువారు వారినిఅరెస్టుచేయలేదు- పోలీసువారు ఆగ్రామం అసలురానేలేదు. కొంతకాలం ఆగ్రామంలంతా యుద్ధవ్యతిరేకప్రచారము చేసుకొని సరాసరి భీమవరంచేరటానికి పయనమైనారు-

౧౬-౨-౪౧తేదీని కోపల్లెగ్రామంలో సత్యాగ్రహముచేసి అరెస్టుకాబడిన శ్రీదేవరెడ్డిభీమన్న గారిపై పోలీసువారు భీమవరంసబ్ మేజిస్ట్రేటుకోర్టులో దాఖలుచేసిన న్యూసెన్సు కేసును భీమవరంసబ్ మేజిస్ట్రేటు గారు విచారణగావించి ఇరువదిఅయిదురూపాయిలు జుర్మానా విధించినారు- అదిచెల్లించనిచో ఒకనెల శిక్ష అనుభవించవలెనని తీర్పుచెప్పిరి-

తెనాలితాలూకాలో౧౭-౨-౪౧-౧౮-౨-౪౧వ తేదీలలో శ్రీగోళ్ళమూడిపిచ్చయ్యగారు కడ్లమూడిగ్రామంలోను, శ్రీ కావూరి అప్పయ్యగారు, చేటపాలెంగ్రామంలోను, శ్రీ పుయ్యూరు వెంకటరామయ్యగారు రావికంపాటి గ్రామంలోను, శ్రీ యస్.హనుమంతరావుగారు తుమ్మపూడిగ్రామంలో, శ్రీకట్టికూటిరాజగోపాలంగారు, చేటపాలెంగ్రామంలోను శ్రీరావిపాటిన రసయ్యగారు చేటపాలెం గ్రామంలోను, యుద్ధప్రతికూలసత్యాగ్రహము గావించిరి- పైసత్యాగ్రహులలో శ్రీకావూరిఅప్పయ్య (చేటపాలెం) గారినిమాత్రం పోలీసువారుఅరెస్టుగావించితెనాలిసబుజైలులో రిమాండులోనుంచిరి- మిగిలినవారిని అరెస్టుగావింపలేదు-

బాపట్లతాలూకా బ్రాహ్మణకోడూరుగ్రామవాస్తవ్యులును సుప్రసిద్ధకాంగ్రెసువాదులునుఅగు శ్రీమాధవపెద్దిలక్ష్మీనరసయ్యగారు ౧౫-౨-౪౧వతేదీన బ్రాహ్మణకోడూరు గ్రామంలో సత్యాగ్రహముగావించిరి- పోలీసువారుఅరెస్టుచేయనందున శ్రీలక్ష్మీనరసయ్యగారు గ్రామములలో యుద్ధప్రతికూలోపన్యాసములు గావించుచు తిరుగుచున్నారు-

ఫిబ్రవరి౧౭వతేది ఏలూరులో సత్యాగ్రహమొనర్చుటకై అరుగుచుండగా త్రోవలో అరెస్టుచేయబడి న్యూసెన్సుకేసుపెట్టబడిన శ్రీ వీరియాల వెంకట్రావుగారివిచారణ ౧౯వతేది జరిగియుండెను- మేజిస్ట్రేటుగారు శ్రీ వెంకట్రావుగారిని దోషిక్రిందనే పరిగణించి వారోజులు విడిశిక్షను విధించిరి. శ్రీవెంకట్రావుగారితరఫున శ్రీయుతులు పోతాప్రగడరమణారావు, పోపూరివెంకటకామేశ్వరరావు గార్లు వాదించిరి వెంకట్రావుగారిశిక్షపై సబుడివిజనలుమేజిస్ట్రేటుగారి ఎదుట అప్పీలు దాఖలు చేయబడునని తెలియుచున్నది. ఫిబ్రవరి౧౦వతేదీన సత్యాగ్రహమొనర్చగా అరెస్టుచేయబడిన శ్రీగోపాలనివెంకటపేరయ్యగారి రిమాండుదినములు పదియున్నూ ౧౯వ తేదీతో పూర్తియగుటవలనను, పోలీసువారు వారిపైఏమియు చార్జిషీటు పెట్టనందునను, మేజిస్ట్రేటుగారు వారిని వదలివేసిరి. కొడాలి సుబ్బారావుగారు ౧౯వతేదిమధ్యాహ్నము గడ్డిబజారునద్ద సత్యాగ్రహమొనర్చగా అరెస్టుగావింపబడలేదు. తరువాత శ్రీసుబ్బారావుగారు బజారంతయూ సత్యాగ్రహమొనర్చుచూ తిరిగిరిగాని వారినరెస్టుచేయలేదు.

జనవరి౨౫వతేదిన చిత్తూరు శ్రీ పి.అళ్వారుశెట్టిగారు పుంగనూరులో సత్యాగ్రహంచేసినందున మదనపల్లి జాయింటు మేజిస్ట్రేటుగారితనికి ౫౦౦రూ. జుర్మానాను, కోర్టులేచువరకు శిక్షయున్ను విధించిరి.

శ్రీశెట్టిగారింతవరకు జిర్మానా చెల్లించకనే రద్దుచేయుమని జిల్లాకోర్టులో అపీలు ఫిబ్రవరి౧౫వ తేది దాఖలుచేసిరి. అందుపై జిల్లాజడ్జిగారాపిన యమై తాత్కాలికముగా నిలుపదల అర్డరునిచ్చి ౨౧-౨-౪౧తేదీనాటికి విచారణ చేయునట్లు ఉత్తరువుచేసిరి.

### శ్రీమతి అరుణ అసఫాలిగారికి శిక్ష

ఇటీవల సత్యాగ్రహంచేసిన శ్రీమతి అరుణ అసఫాలిగారికి క్రొత్తఢిల్లీ అడిషనలు జిల్లామేజిస్ట్రేటు ఫిబ్రవరి ౨౧వతేది ఉదయము ౧ సం. విడిఖైదువిధించి (ఎ) తరగతిలోనుంచుటకు సిఫార్సుచేసెను.

జలందరు జిల్లాలో సత్యాగ్రహంచేయునట్లు జరిపిన ౨౫ మంది అకాలి కాంగ్రెసువాదుల పేర్లను మహాత్మాగాంధిగారు అనుమతించినట్లు తెలుస్తున్నది.

### రాజేంద్ర ప్రసాదుగారి అభిప్రాయం

సత్యాగ్రహం రెండవదశలో, సత్యాగ్రహంచేయవలసినవారి జాబితాపూర్తిఅయ్యేటప్పటికి మూడవదశలో సత్యాగ్రహంచేయవలసినవారిపేర్లుఆమోదంపొంది సిద్ధముగానుండుకారణమున యీరెండుదశలమధ్య విరామము ఫిబ్రవరి ౨౧వతేది ఉదయము పాట్నాలో రాజేంద్రప్రసాదుగారు పత్రికాప్రతినిధులతో చెలిపిరి. కొన్నిరాష్ట్రప్రభుత్వాలు యిటీవల సత్యాగ్రహులను అరెస్టు చేయనివిషయమై రాజేంద్రబాబుగారు అభిప్రాయమువెలుపుచూ ఆపద్ధతివల్ల ఉద్యమాభివృద్ధికి ఏవిధమైనఅడ్డుకలుగదనిరి.

### హరిజన యువకుని సత్యాగ్రహము

డోను అనుమోరిలో ౧౬-౨-౪౧ తేదిన హరిజన పొట్లి రామన్న గారు యుద్ధవ్యతిరేక పుకేకలు వేసిరి పోలీసువారు అరెస్టుచేయుటకురాలేదు.

సత్యాగ్రహముజరుపుటకు పూర్వము గ్రామపెద్దలు ఈహరిజనసత్యాగ్రహిని దేవాలయములో నికితీసుకొనిపోయి ప్రార్థనలుజరిపిరి.

### పోలీసుల విచారణ

ప॥ గోదావరిజిల్లాలో వడలి గ్రామములో పుష్పలపాటి వెంకటనారాయణ చౌదరిగారు ఫిబ్రవరి ౧౯వ తేది ౧-౩౪ గంటలకు సత్యాగ్రహం చేసిరి. పోలీసువారుఎవరునురాలేదు. అచ్చటనుండి వెంకటరామపుర అగ్రహారం వెళ్లుటకు సిద్ధముగాయుండగా పోలీసువారువచ్చి సత్యాగ్రహియొక్క- భూమి. కాంగ్రెసులోగల హోదాయు అడిగిరి. సత్యాగ్రహి వారికిసమాధానమిచ్చి వెంకటరామపుర అగ్రహారంవెళ్ళిరి. అచ్చటకూడా అరెస్టుకాలేదు.

### పట్టుకొనుట విడుదల

ఫిబ్రవరి ౧౬వతేది సాయంకాలం ధర్మవరం తాలూకా మాల్యంతమను గ్రామములో మంగలవరసప్పయ్యను నతడు యుద్ధప్రతికూల సత్యాగ్రహమొనర్చెను. పోలీసువారు అతనిని నిర్బంధించి ధర్మవరానికి గొనివచ్చిరి. కాని ౧౭వతేది విడుదలచేసిరి. ౧౮వతేది సాయంకాల మిాదేతాలూకా అప్పరాశ్చెఱువు పల్లెలో ఏ. వాసుదేవమూర్తి యను యుద్ధప్రతికూలవాక్యముల నుచ్చరించినందులకై అరెస్టుచేయబడి ౧౯వతేది మధ్యాహ్నం ధర్మవరానికి తీసికొనిరాబడెను విడుదలచేయబడెను.

### సత్యాగ్రహుల ఢిల్లీయాత్ర

౧౬-౨-౪౧ తేదీని సుమ్మలూరులో సత్యాగ్రహంచేసిన శ్రీఅల్లూరి సత్యరాజు గారు మార్గంలోవుండే గ్రామములలో యుద్ధవ్యతిరేకప్రచారంచేయుచూ నర్సాపురంచేరినారు. ౧౭-౨-౪౧ తేదీని లక్ష్మణేశ్వరంలో సత్యాగ్రహం చేసిన శ్రీ బిళ్ళ కృష్ణమూర్తిగారినికూడ అరెస్టుచేయలేదు, కాని మళ్లీపోలీసుమాత్రం సత్యాగ్రహము చేయుటకుముందేవచ్చి శ్రీ కృష్ణమూర్తిగారితోకూడా నర్సాపురంవచ్చిరి. ఉభయసత్యాగ్రహులు నర్సాపురంలో కలుసుకొని దిగమర్రు, అగర్రు, గోరింటాడ గ్రామములో యుద్ధవ్యతిరేకం ప్రచారంచేస్తూ ౧౯వ తేది సాయంత్రమునకు పాలకొల్లువచ్చి ప్రబోధముచేసిరి. తర్వాత జిన్నూరు మట్టుపర్రు, వేడంగి, కవిటం గ్రామాలలో ప్రచారం నిమిత్తంవెళ్ళిరి.

గుంటూరు జిల్లాలో సత్యాగ్రహముచేసి అరెస్టుకాకుండాఉండిన శ్రీ దంతులూరి సాంబరాజు, ఉద్దరాజు కోటంరాజు, ముత్తినేని నాగయ్యగార్లు ఢిల్లీకి పోవుచున్నారు.

## ఆంగ్లస్త్రీసత్యాగ్రహము

ఫిబ్రవరి ౨౧వ తేదిన ఫ్రెడా బేడీఅను ఆంగ్లయస్త్రీ నిన్న డేరాబాబానానకవద్ద (లాహోరుకు ౫౦మైళ్లదూరములో) సత్యాగ్రహముచేసెను. ౬నెలల ఖైదుశిక్షవిధింపబడెను. ఈమె లాహోరులోని సామ్యవాదప్రచారకులగు బి.పి.యల్. బేడీగారిభార్య- ఆమె లాహోరులోని స్త్రీలకళాశాలలో ఇటీవలివరకు ప్రొఫెసరుగాపనిచేసెను. హీరాలాలులోహియా, ప్రేమచదుమిత్రా, నామవాధసింగు, సినాలీ గనేరియా, విశాయిలాలుగుప్త, హరిచరణ సురేవాలా, భోలాసింగు, జగత్ నారాయణశుక్ల.- ఈ ౯ మంది సత్యాగ్రహులును, ఫిబ్రవరి ౨౨వ తేది కలకత్తానుండి, కాలినడకను ఢిల్లీకిబయులుదేరి, త్రోవలో సత్యాగ్రహంచేయుచుపోవుదురు.

### డిటెన్యూలు

కేంద్రప్రభుత్వమువారి ఉత్తరువుప్రకారం నిర్బంధింపబడినవారు ౪౫ రాష్ట్రప్రభుత్వముల ఉత్తరువులప్రకారం డిటెన్యూలు క్రిందిలెక్కలో నున్నవి.

| | | |
|---|---|---|
| మదరాసు | జన ౩౧ నరికి | ౯౨ |
| బొంబాయి | | ౧౬౯ |
| బెంగాలు | | ౧౪౦ |
| సంయుక్తరాష్ట్రం | జన ౧౫ వరకు | ౧౮౩ |
| పంజాబు | | ౧౧౫ |
| బీహారు | | ౨౯ |
| సి. పి., బీహారు (౩౧-౧-౪౧)వరకు | | ౨ |
| సరిహద్దురాష్ట్రం | | ౯ |

అస్సాం, సింధు, ఒరిస్సాలలోలేవు. మకింకా కీసంఖ్యలు తయారుచేయలేదు. తయారుచేయించినచో ఖర్చులు తగినఉపయోగం ఉండదని ప్రభుత్వంవారనుకొంటున్నారు.

## సత్యాగ్రహఖైదీలు డిటెన్యూలు

### రాష్ట్రివారీగా సంఖ్యలు-ప్రభుత్వ ప్రకటన

ఢిల్లీఅసెంబ్లీలో ఫిబ్రవరి ౨౨వతేది సర్దారు శాంతసింగుగారిప్రశ్నలకు ప్రత్యుత్తరంగా సర్ రెజినాల్డు మాక్సువెలుగారు (హోము మెంబరు) డిటెన్యూల, సత్యాగ్రహఖైదీలసంఖ్యలను తెలిపిరి.

### సామ్యవాదుల ఇండ్ల సోదాలు

పూనా, ఫిబ్రవరి ౨౨

నిన్న పూనాలో సామ్యవాదులఇండ్లు ౩సోదా చేయబడెను, ౩ఇండ్లలో యుద్ధప్రతికూల ప్రచారకాగితములు దొరికెను. రెండుఇండ్లలో రెండునాళముల తుపాకీ ఒకటిదొరికెను. టైపురైటింగుయంత్రాలుదొరికెను. ముగ్గురు అరెస్టుచేయబడిరి;

### సత్యాగ్రహులు

కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వముల ఉత్తరువులప్రకారం మొత్తం ప్రాసిక్యూషను చేయబడిన సత్యాగ్రహులసంఖ్య ౫౮౨౧ శిక్షలపొందినవారిసంఖ్య ౬౩౪౬ ఖైదీలలో శిక్షననుభవించుచున్నవారు ౧౬౬౪ సం॥ రాష్ట్రీయరాయలంను ప్రాసిక్యూషనుఅయినవారిసంఖ్య తెలియదు సరిహద్దు, ఒరిస్సా, బెలూచిస్థానములందు శిక్షలుపొందిన వారిసంఖ్యలు తెలియవు.

రాష్ట్రవారీఫిబ్రవరి ౧౨వతేదీసరికి యుద్ధప్రతికూల సత్యాగ్రహమునందు శిక్షలువిధింపబడినవారు క్రిందిరీతిగనున్నారు.

| | |
|---|---|
| మదరాసు | ౩౩౦ |
| బొంబాయి | ౫౨౨ |
| బెంగాలు | ౪౩ |
| సంయుక్తరాష్ట్రం | ౯౫౩ |
| పంజాబు | ౪౭ |
| బీహారు | ౧౪౯ |
| మధ్యరాష్ట్రం | ౨౭౩ |
| అస్సాము | ౧౩౧ |
| సరిహద్దు | ౭ |
| ఒరిస్సా | ౨౭౪ |
| సింధు | ౦ |
| కూర్గు | ౬ |
| ఢిల్లీ | ౬౭ |
| అజ్మీరు, మీర్వారు | ౫ |
| బులూచిస్థాను | ౦ |

## ఆర్యసమాజాల హోలీ ఊరేగింపు

హైదరాబాదు(దక్కను) ఫర్వర్దీ ౨౪
ఫర్వర్దీ ౨౪వ తేదీ శుక్రవారం నాడు సాయంత్రము ౬½ గంటలకు పండిత వినాయకరావు విద్యాలంకారు బారిష్టరుగారిగృహమందు కిషన్‌గంజి ఆర్యసమాజాధ్యక్షులగు పండిత కేశవప్రసాదుగారి అధ్యక్షతన హైదరాబాదు నగరమందలి సమస్త ఆర్యసమాజముల కార్యదర్శుల సభ జరిగెను. ౧౫ సమాజాల కార్యదర్శులు సమావేశమైరి. ఈ క్రింది విధముగ తీర్మానింపబడెను:—

రాబోవు అర్ధిబెహిస్తు ౯వ తేదీనాడు ఫాల్గుణ శుద్ధ పూర్ణిమయగును. ఆరోజు హోలీ ఊరేగింపును ప్రతిసంవత్సరంవలెనే జరుపవలెను. నగరములోని అన్ని ఆర్యసమాజాల 'ఓం' పతాకములను ఊరేగించుచు పగలు ౨ గంటలకు ముందు కిషన్‌గంజి ఆర్యసమాజపు మైదానానికి చేర్చవలెను. కిషన్‌గంజి ఆర్యసమాజమువారి 'ఓం' పతాకపు ఊరేగింపు సరిగా మధ్యాహ్నము ౨ గంటలకు బయలుదేరును. దానితోకూడ తక్కిన 'ఓం' పతాకాలుకూడ కదలును. కిషన్‌గంజి ఆర్యసమాజమునుండి పండిత వినాయకరావుగారును, పండిత నరేంద్రగారును ఊరేగింపు సంచాలనము చేసెదరు. ఈ ఊరేగింపుల పక్షమునను, కిషన్‌గంజి ఆర్యసమాజపక్షమునను అచ్చువేయించిన భజనావళినే పాడుట కుపయోగింతురు.

## ఆర్యసమాజ సభ

### పోలీసు నివేదికనుగూర్చిన అసమ్మతి

హైదరాబాదు(దక్కను) ఫర్వర్దీ ౧౪.
హైదరాబాదు సంస్థాన ఆర్యప్రతినిధి సభయొక్క అవసరసమావేశము వినాయకరావుగారి అధ్యక్షతక్రింద జరిగినది. జిల్లా పోలీసుశాఖవారి ౧౩౪౯ ఫసలీ పరిపాలననివేదికలో వ్రాయబడిన కొన్ని వాక్యములకు అసమ్మతి ప్రకటించుచు, వానిని ఆనివేదికనుండి తొలగింపవలెనని తీర్మానము చేయబడినది.

"పోలీసువారికి అపకీర్తి తెచ్చుటకై ఆర్యసమాజప్రచారకులు కొంత ప్రయత్నించెనివా ప్రజా ... హుళ్యముతో మాసంబంధములు సరిసముగా లేకుండెను" అని వ్రాసినవాక్యము తొలగింపవలెనని కోరబడినది. పోలీసువారిమీద ద్వేషము, దురభిప్రాయము పుట్టించుగార్యాలు వేటినీ ఆర్యసమాజంవారు చేయలేదని తీర్మానంలో చెప్పబడినది. పోలీసువారు పక్షపాతంతో వర్తించుచున్నట్లు మావద్దకువచ్చిన మెయిలును పైఅధికార్లకు తెలియచేయుచుంటిమి. కాని ఈపని పోలీసు అధికారులపట్ల విరోధప్రచారమని మేము భావించము—అని తీర్మానంలో తెల్పబడినది.

ఆర్యప్రతినిధిసభవారు అంతర్జాతీయ ఆర్యసమితివారికి ఒకవిజ్ఞప్తి చేసి ఈ విషయమై మ.ఘ.వ. నిజాముప్రభుత్వముతో ఉత్తరప్రత్యుత్తరములు జరిపి ఈవాక్యములను తొలగించునట్లు చూడవలసినదిగనువారికి ఈసభవారు తమవిజ్ఞప్తిలో తెలియచేసిరి.

## నిజాంరాష్ట్ర ముదిరాజ మహాసభ

హైదరాబాదు(దక్కను). ఫర్వర్దీ ౨౧
మ.ఘ.వ. నిజాంరాష్ట్ర ముదిరాజ మహాసభయొక్క ఆహ్వానసంఘములోనిసభ్యులు నేడుసమావేశమై తమసంఘమునకు బి వెంకటాపు (హైకోర్టు వకీలు)గారిని అధ్యక్షునిగాను, సికింద్రాబాదువాసి నీలంబాలయ్య, సత్యనారాయణగార్లను ఉపాధ్యక్షులుగాను, బి. వెంకటస్వామి (హైదరాబాదువాసి), యస్. రామస్వామి (సికింద్రాబాదువాసి)గార్లను కార్యదర్శులుగాను ఎన్నుకొనిరి.

మహాసభ రాబోవువృషసంవత్సర వైశాఖబహుళచవితి. పంచమి షష్ఠులకు సరియగు తీరు ౫వ.౧౦వ,౧౧వ తేదులలో కాచిగూడెంలోని తులాభవనంలో జరుపుటకు నిశ్చయించిరి. ఆహ్వానసంఘ కార్యాలయము గౌలిగూడెంలోనుండును. మహాసభకు శ్రీమాన్ కృష్ణస్వామిముదిరాజగారు అధ్యక్షతవహింతురు.

మహాసభలో ప్రవేశపెట్టుటకు తీర్మానములను ఆహ్వానసంఘకార్యాలయానికి తెల్పవలెను. ఆహ్వానసంఘ సభ్యత్వపు చందారూ౫లు, మహాసభప్రతినిధిరుసుము రూ౧. ప్రేక్షకులకుఉచితము.

మహాసభలో పాల్గొనదలచినజిల్లాలవారు ప్రతినిధి ... అందఱకు పంపవలెను. ముదిరాజు కులసోదరులు ఎక్కువగా పాల్గొనవలెనని ఆహ్వానసంఘమువారు కోరుచున్నారు.

## కషహాస్టల్‌కు క్రాఫ్టుగారి రాక

ఖమ్మంమెట్టు, ౧౪-౫-౫౦
భూమ్యాదాయశాఖకార్యదర్శి ఆర్-యమ్ క్రాఫ్టు ఐ-సీ-యస్‌గారు పాల్వంచతాలూకానుండి ఖమ్మంమెట్టుకు విజయముచేసిరి. ఖమ్మంమెట్టుయందుండిన కషహాస్టలులో శ్రీవారికి యారోజు ౫గంటలకు టీపార్టీచేసిరి. ఈ పార్టీలో ప్రభుత్వఉద్యోగస్థులును, పురప్రముఖులు పాల్గొనిరి. శ్రీవారికి హాస్టల్‌లోని విద్యార్థులు స్వాగతమిచ్చిరి. హాస్టల్ కార్యదర్శి క్రాఫ్టుగారికి పూలహారముచేసి సన్మానించిరి హాస్టల్‌గదులన్నియు పరిశీలించిరి. ఒకఅరగంటకాలము హాస్టల్‌కార్యకర్తలతో మాట్లాడిరి ఖమ్మంమెట్టులోకల్ ఫండుశాఖవారు యీహాస్టలుపై మునిసిపల్ టాక్సు విధించియుండిరి- ఇట్టిటాక్సువిషయమునుగురించి ప్రస్తుతము వ్యవహారమును సుబాలోజరుగుచున్నది ఈ పన్నువిషయములో క్రాఫ్టుగారికి మనవిచేసికొనగా, యిటువంటివిద్యాసంస్థపై మునిసిపల్ టాక్సుతీసుకొనుటకూడదనియు, అనుకూలముగా ప్రయత్నము చేయుమనియు, సెలవిచ్చిరి. హాస్టల్‌నుగూర్చిఅభిప్రాయం యీక్రిందివిధముగా శ్రీవారువ్రాసిరి.

ఈకట్టడమునకు హేతుభూతులయినవారికిది చాలాగౌరవమును తెచ్చుచున్నది. స్థానికసహాయముతోడను, విజ్ఞానముతోకూడిన నాయకత్వముతోడను ఈకట్టడమెందుకొరకేర్పడినదో దానిని సఫలముచేసితీరునని విశ్వసించుచున్నాను. ఈ సంస్థఅభివృద్ధిని నేనుమనస్ఫూర్తిగ కోరుచున్నాను.

క్రాఫ్టుగారు మాఆహ్వానమంగీకరించి హాస్టలుకు విజయముచేసి, మాకొసగినసలహాలకు వారికికృతజ్ఞతా వందనములర్పించుచున్నాము.

ఇట్లు
చావా వెంకటకోటయ్య
కార్యదర్శి

## నిజాంరాష్ట్ర ఆంధ్ర మహాసభ

ఈసారి నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభను నల్లగొండజిల్లాలోని హుజూరునగరుకద్దనొక గ్రామంలో రాబోవు ఏప్రిలులో జరుపుటకు నిర్ణయమైనట్లు తెలియుచున్నది. ఆసభకు అధ్యక్షుని ఎన్నుకొనుటకై అన్నిజిల్లాల, తాలూకా ఆంధ్రజన సంఘాలకు హెచ్చరికలంపబడినవి.

## మహబూబు కాలేజి బహుమాన ప్రదానోత్సవము

గౌ॥ రెసిడెంటుగారి అధ్యక్షత

సికింద్రాబాదు(దక్కన్)లో మహబూబు కాలేజి విద్యార్థుల వార్షిక బహుమానప్రదానోత్సవము ఫర్వర్ది ౧౩ వ తేది సాయంకాలము గౌ॥ రెసిడెంటు సి. హెచ్. గిడ్నీగారి అధ్యక్షతన జరిగెను.

ఆ కాలేజి పాలకవర్గ గౌరవ కార్యదర్శియగు దివాన్‌బహద్దర్ ఎ వేణుగోపాలుగారు ౧౯౩౯ నుండి ౧౯౪౦ వరకు కాలేజి అభివృద్ధినిగురించిన నివేదికను చదివివినిపించిరి. నివేదికలోని ముఖ్యాంశములిట తెలుపబడును. ౧౯౩౯ జనవరిలో ఉన్నంత ఎక్కువమంది విద్యార్థులు అబడిలో మరెప్పుడును లేకుండిరి. అప్పుడు ౨౬౮ మంది బ్రాహ్మణులు, ౨౫౦ మంది బ్రాహ్మణేతరులు, ౧౧౮ మంది మహమ్మదీయులు, ౩౫ మంది భారతీయక్రైస్తవులు, ౭ గురు పార్సీలు—ఇట్లు మొత్తము ౬౭౮ మంది విద్యార్థులుండిరి. హెచ్.యస్.యల్.సి. పరీక్షలో ఈ బడినుండి ౧౩౩ మంది పోయిరి. వారలలో ౧౦౭ మంది ఉత్తీర్ణులైరి. ౧౧ మంది మొదటిదర్జాగాను, ౬౯ మంది రెండవదర్జాగాను, ౨౭ మంది మూడవదర్జాగాను ఉత్తీర్ణులగుటయేగాక, మొత్తం రాష్ట్రంలో ఈ బడిలో నిద్దరు మొదటిదర్జాలోను, మరొకరు రెండవదర్జాలోను ఉత్తీర్ణులైరి. ఈ బడిలోనివారు ౧౭ మందికి నైజాం కాలేజిలోను, ౭ గురికి ఉస్మానియాయూనివర్సిటీలోను స్థానాలు దొరకెను. తక్కినవారలలో అనేకులు రాష్ట్రము వెలుపలికి పోవలసివచ్చినది. వ్యాయామపోషణకై ఈబడిలో చదువు దూరప్రాంతాలవారు తమతమ ప్రాంతములో వేర్వేరు క్రీడాసంఘములను ఏర్పాటుచేసికొని ఈ బడినుండి ఆటలసామానులు తీసికొనిపోయి ఆడుకొనుటకు సౌకర్యములు కల్పించబడినవి. పి. యస్. కొలిన్సుగారు ముష్టియుద్ధ విధానము నేర్పించిరి. సికింద్రాబాదులో కుస్తీపోటీలసంఘము వారేర్పరచిన పోటీలో ఈబడిబాలురు గెలిచిరి. యోగాసనప్రదర్శనములోగూడ ఈబడిబాలురు రెండుకప్పును బహుమానముగ పొందిరి. సికింద్రాబాదు మితపానసంఘమువారేర్పాటుచేసిన పోటీపరీక్షలో ఈబడిలోనియిద్దరుపిల్లలు మొదటి రెండవబహుమతులనుపొందిరి. సెయింటుజాన్ అంబులెన్సు అసోసియేషన్‌వారు నేర్పించిన అకస్మికోపద్రవచికిత్సవిధానములో ౧౧ మంది ఈబడి బాలురుపరీక్షలో కడతేరిరి. స్కౌటులో ఈబడి యందు రెండుట్రూపులు ఒకపాట్రోలు ఉండెను. ౧౯౩౦ నుండి ౧౯౩౯ వరకు ఈబడికి ప్రభుత్వమిచ్చు ధనసహాయము సం॥కు ౧౫౦౦ రూపాయీలకు తగ్గించబడినది. ఇందువల్ల కొందరుపాధ్యాయులకు వారి యోగ్యతలనుబట్టి జీతాలు హెచ్చించుటకు వీలుకాకపోయినది. వారు ఉద్యోగమునుండి విరమించుకొన్నవారు అంవోళనలేకుండా జీవించేటందుకు తగినట్లుగా జీతాలు హెచ్చించుటకు వీలుకాకపోయినది. కనుక రెసిడెంటుగారు ప్రభుత్వధనసహాయాన్ని హెచ్చించవలసినది. విద్యార్థులసంఖ్య హెచ్చుటవల్ల తాత్కాలికంగా కొన్నితరగతులను వరాండాలలో నిర్వహించవలసివచ్చుచున్నందువల్ల రూ ౨౫,౦౦౦ల పాలీలఖర్చుతో క్రొత్తబిల్డింగుకట్టించవలచి ప్రభుత్వాన్ని పాలీరూ ౧౫,౦౦౦ల ధనసహాయముకోరగా ప్రభుత్వంవారు ఈసహాయం క్రొత్తసంవత్సరం బడ్జెటులో చేయును కాబట్టి రెసిడెంటుగారు అనుమతించేవరకు బిల్డింగుపని ప్రారంభించరాదనిజవాబువచ్చెను. ఆ సహాయం మంజూరుచేయబడునదనే నమ్మకంతో, ఇపుడుబిల్డింగుపని ప్రారంభించుటకు రెసిడెంటుగారు అనుమతినీయవలెనని నివేదికలో కోరబడెను.

తర్వాత బహుమానాలిచ్చినతర్వాత రెసిడెంటుగారుపన్యసించిరి. మొదటవారు ఆబడిలోని ఉపాధ్యాయులును, విద్యార్థులును కలిసి హైదరాబాదు హరికేన్‌నిధికి ధనసహాయం చేసినందుకు మెచ్చుకొనిరి. బళ్లో చదువుచుండే విద్యార్థుల సంఖ్య హెచ్చినందుకును ప్రతిసంవత్సరం ఎక్కువమందివిద్యార్థులు సంవత్సరంలో గైర్‌హాజరుకావందుకును హెచ్.యస్.యల్.సి. పరీక్షలలో చాలమందివిద్యార్థులు కడతేరినందుకును మెచ్చుకొనిరి. ఈబడిఉపాధ్యాయులసామర్థ్యానికి ప్రతిష్ఠయుండియాలో! బెయినిరుసౌకర్యాలిప్పించినందుకు సంతోషము తెలిపి, రెసిడెంటుగారు కొందరికి చదువు నేర్పేశక్తి సహజమైనను, ఆ నేర్పుకు సరియైన టెయినింగు చాలా అవసరమనిరి. బడివారు వ్యాయామవిద్యకు మంచిసౌకర్యాలేర్పరచినందుకును, సాహిత్యసంఘాలు, యాత్రలు జాటకొలాడించుట మున్నగువినోదాలేర్పరచినందుకును రెసిడెంటుగారు సంతోషించిరి. ఆకస్మికోపద్రవ చికిత్సావిధానము నేర్చుకొనుటకు ఇంకను ఎక్కువమందివిద్యార్థులు ముందుకురావలెననిరి. అసలుఈకాలంలోనే ఉపద్రవాలుఎక్కువ్యయమనియు, అందులోను యుద్ధకాలంలో మరీ ఎక్కువయనియు, అందువల్ల ఈవిద్యను ఎక్కువమందినేర్చుకొనేటట్లు చేయవలెననియు చెప్పిరి, స్కౌటువిషయంలోకూడ విద్యార్థులఉత్సాహం చాలదనిచెప్పిరి. బడిబిల్డింగుకుగాను కోరిన రూ ౧౫,౦౦౦ల ధనసహాయంవిషయంలో ఆ విషయం ముందు తినద్గవిచారణకువచ్చినప్పుడు ఆలోచించగలను, ఇప్పుడేమీచెప్ప వీలులేదు అనిరి. బడియొక్క ఆర్థికస్థితిమంచిగానున్నదనిరి. బడిపిల్లలవల్లవచ్చేజీతాలుఎక్కువై, ప్రభుత్వంవారిచ్చే ధనసహాయంతగ్గించినప్పుడే ఉపాధ్యాయుల జీతాలలో అవసరములైనహెచ్చింపులు చేసియుండవలసినదనిరి. ఇపుడు ప్రజలనుండి ఎక్కువగా సంపాదించుకొనవలసినదనిరి.

— —

సంవత్సరము చందా
౯ రూపాయలు
ఆరుమాసాలకు
౫ రూపాయలు
బ్రిటిషిండియాలో
సం॥ చందా
౫-౮-౦ ల్లారు,
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only Popular Paper That reaches The masses In the Dominions

Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

**Volume 15** **Hyderabad-Dn.** **Thursday 27 February 1941** **Number 82**

## ఓరంగల్లుజిల్లాద్వితీయాంధ్ర మహాసభ

విజ్ఞప్తి.

హనుమకొండ ఫర్వర్ది, ౨౧

మహబూబాబాదు తాలూకా, ఈదులపూస పల్లిలో ది ౯ అర్ధిబేహస్త స్న ౧౩౫౦ ఫ. అందు పైసభను, జరుపనుద్దేశించి ఆహ్వానసంఘమువారు తగుప్రయత్నములు చేయుచున్నారు. గాన ఓరుగల్లు జిల్లాలోని పురసంఘమును, తాలూకాసంఘములన్నియును తమ అభిప్రాయములు తెలుపవలెను. ఆ మహాసభలో ప్రవేశపెట్టదలచుకొనిన తీర్మానములను (౩౦) ఫర్వర్ది స్న ౧౩౫౦ ఫ లోగా హనుమకొండ జిల్లాసంఘ కార్యస్థానమునకు అందజేయవలెను. తదితర ప్రజాహితసంస్థలవారును పైతేదీలోగానే తీర్మానములనంప ప్రార్థితులు

ఇట్లు,
కార్యదర్శి,
ఓరుగల్లు జిల్లా ఆంధ్రజనసంఘము,
హనుమకొండ.

---

## ఖాదీప్రచార సంఘస్థాపన

బొలారం, ఫిబ్రవరి ౨౩

నిన్నటిరోజు తేది ౨౨వ ఫిబ్రవరి ౧౯౪౧ శనివారం రాత్రి ౯ గంటలకు ఖద్దరుధరించు స్వభావముగల ఖద్దరుధారులసభయొకటి స్థానికమైన పుస్తకాలయములో హైదరాబాదు ఖాదీప్రచార సంఘకార్యదర్శులగు శ్రీమాన్ రామకృష్ణధూత్ గారి అధ్యక్షతను సమావేశమయ్యెను.

అధ్యక్షులవారు సంక్షేపముగా ఖాదీప్రచారసంఘముయొక్క ఉద్దేశ్యమును సభికులకు తెలియపరచిరి. ఖాదీప్రచారమునిమిత్తము బొల్లారములో సహితము సంఘముయొక్క శాఖను స్థాపించవలెనని ఆదేశించిరి. విచారణానంతరము సర్వజనులసమ్మతిచే ఖాదీప్రచారసంఘశాఖయొకటి నెలకొల్ప నిశ్చయింపబడెను. తదనంతరము ఏకగ్రీవముగా డాక్టర్ సి. ఆర్. రామకృష్ణరెడ్డిశర్మగారు అధ్యక్షులుగాను పారసమల్ గారు కార్యదర్శిగాను గలఒక కార్యవర్గమెన్నుకొనబడిరది.

భావికార్యక్రమములనుగూర్చి ఆలోచనలుజరిగిన పిమ్మట రాత్రిసుమారు ౧౦ గంటలకు సభ ముగిసెను.

---

## విద్యాలయంలో పౌరులసభ

అద్వైతేపల్లి, తే॥ ౨౦-౫-౫౦ ఫ.

(ఒక విలేఖరి)

నల్లగొండ జిల్లా మిర్యాలగూడెం తాలూకాయందుండిన అద్వైతేపల్లియను గ్రామముయొక్క ప్రాథమికవిద్యాలయమందు విద్యాభివృద్ధి నిప్రోత్సహించుటకై పౌరజనుల ఉద్దేశ్యములపై నేడు సాయంత్రము ౫౦. ౩లకు సభప్రారంభింపబడెను రా॥ యం. అమ్మనర్సింహారావుగారు అధ్యక్షతవహించిరి. కే. వెంకటేశ్వరరావుగారు విద్యయొక్క ప్రయోజనమునుగురించి ఉపన్యసించిరి, స్త్రీవిద్య ప్రాముఖ్యమునుగురించి రా॥ ముప్పవారపు వెంకట రామారావుగారు ఉపన్యసించిరి. ప్రేక్షకులకు కౌతుకమనోరంజకమనంతరము ఆర్. సత్యనారాయణగారు ప్రపంచమందలి వివిధదేశాలస్థితిని, అక్కడి ప్రజలస్థితిగతులనుగురించి ఉపన్యసించిరి. డి. వెంకటేశ్వరరావుగారు ఆరోగ్యమునుగురించి ఉపన్యసించిరి. అధ్యక్షులవారు విద్యనుగురించి కొన్నిసంగతులు ఉపన్యసించిరి. తదనంతరము ప్రధానోపాధ్యాయుడు జనాబు అబ్దుల్‌కరీంగారు తమవిద్యాలయమందు ఉపాధ్యాయులగు కూరాక్ల గోపాల్ గారు ఆ గ్రామపౌరుల బృందముయొక్క అభిలాష నెరవేరునట్లుగా జరిగినందులకు వారికి దనవాదములర్పించిరి. అనంతరముసభికులందరును మ.ను.న. ప్రభువుగారికి సమస్తసంపదైశ్వర్యములు గలుగునట్లు భగవంతుని ప్రార్థించిరి. సభానంతరము బాలురకు మధురాహారముపంచిరి సభికులందరకును అల్పాహారమువిందొసంగిరి.

---

## ఖమ్మం తాలూకా ఆంధ్రజన సంఘము

నూతన కార్యవర్గము ఎన్నిక

ఖమ్మం. ఫర్వర్ది ౨౮

౨౧-౫-౫౦ ఫ. నాడు సాయంత్రం ౮ గంటలకు గ్రామోద్ధరణ ఆంధ్రగ్రంథాలయమునందు ఖమ్మం తాలూకా ఆంధ్రజన పూర్వ కార్యనిర్వాహకవర్గ సభ్యులు శ్రీయుత చావా భద్రయ్యగారి అధ్యక్షతన సమావేశమైయీ క్రిందికార్యకర్తలను క్రొత్తగాఎన్నుకొనిరి.

అధ్యక్షులు శ్రీయుత కల్యాల వెంకటరాజారాం రావుగారు

(దేశముఖు, దేశపాండ్యా, హైకోర్టు వకీలు)

ఉపాధ్యక్షులు శ్రీయుత పయిడిపల్లిహనుమయ్య చౌదరిగారు,

కార్యదర్శి శ్రీయుత సర్వదేవభట్ల రామనాథం గారు బి, ఏ.

గౌరవకార్యదర్శి శ్రీయుత కొలిపాక వెంకటకిషన్ రావుగారు వకీలు,

సహాయకార్యదర్శి శ్రీయుత చిర్రావూరి లక్ష్మి నర్సయ్యగారు,

కోశాధ్యక్షులు శ్రీయుత కందిరాజు రోరాగానంద రావుగారు దేశపాండ్యా.

వీరుగాక మరి (౯) మంది సాధారణసభ్యులు ఎన్నుకొనబడిరి.

---

## పఠనాలయ స్థాపన

(స్వ.వి.) తెగోడు, ౨౩-౫-౫౦ఫ.

మాగ్రామమునకు నిన్న ౨౨-౫-౫౦ తేదిపగలు ౧౧గంటలకు నిజాంరాష్ట్ర ఆంధ్ర మహాసభా స్థాయిసంఘసభ్యులగు శ్రీయుత వెంకటరాజేశ్వర జోశ్యుల గారు, ఆంధ్రోద్యమప్రబోధమునకై విచ్చేసిరి. ఈసందర్భమున గ్రామయువకుల యిష్టాగోష్ఠి సమావేశముజరిగెను. జోశిగారు సమావేశమైనవారలకు ఆంధ్రోద్యమవిషయము, కాలపరివర్తన, యువకులకర్తవ్యము, పత్రికాపఠనావశ్యకత మున్నగువిషయములు తెలియపర్చిన తదుపరి సభికుల ఏకాభిప్రాయముతో "ఆంజనేయాంధ్రపఠనాలయము" స్థాపించబడినది. శ్రీ [illegible]పాలప్ప గారు అధ్యక్షులుగను, శ్రీ మన్నె అంతయ్యగారు కార్యదర్శిగను, శ్రీ కొమ్మ పర్వయ్యగుప్తగారు కోశాధిపతిగను మరికొందరు సాధారణకార్యకర్తలుగనుగల ఒక కార్యవర్గము ఎన్నుకొనబడినది. ౪గంటలకు సమావేశము ముగించబడెను.

---

## మున్నూరు కాపు శాఖ వారి మూడు శాసనములు

జయంతిపురపు శాసనము,
కొండపల్లి అప్పిరెడ్డిశాసనము

---

శీలంహనుమంతు పునరుద్ధారణ అంజనేయప్రతిష్ఠ
శా.శ ౧౫౭౯- క్రీ.శ. ౧౬౦౭

---

శ్రీసీతారామాయనమః
శ్రీలక్ష్మీనృసింహాయనమః॥

స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౫౭౯అగు నేటి ప్లవంగనామసంవత్సరశ్రావణశు॥౫ నిశారంనాడు కొండపల్లి మున్నూరువిషయవాసి మున్నూరుకులాలంకార పెదతిమ్మారెడ్డికుమారుడు అప్పిరెడ్డి తమపితతండ్రి పెదపిచ్చిపినతిమ్మరెడ్డింగారిఆజ్ఞను ఆచంద్రార్కస్థాయిగా గరుడకంబము ప్రతిష్టించెను. శ్రీముఖనామసంవత్సరశ్రావణబ౹౩ ఆదివారం శీలంయెల్లప్పరెడ్డికొమార్లు హనుమంతుబంధు అభిమాన భక్తి అభిమానంగను పునరోద్ధారక అంజనేయుల ప్రతిష్టించెను" వెంకన్న చేసినాడు.

౨ ఇక్షుపురిశాసనము
కతారినాగమనాయకుని శాసనము
శా.శ.౧౦౬౬- క్రీ.శ. ౧౧౪౪

---

స్వస్తిశకవర్షంబులు ౧౦౬౬అగుం నేటిఉత్తరాయణసంక్రాంతినిమిత్తమున ఇక్షుపురిరాజ్యపాలకుండైన మున్నూరురెడ్డి కులోద్భవుండైన కతారినాగమనాయంకుడు శ్రీత్రివిక్రమదేవరకుంబెట్టిన అఖండవర్తి దివిటుకులోత్తుంగమాడలు ౧౦ వీనిం కేకొనికొమ్మనబోయిన కొడుకు నూగనబోయుండు సంతానక్రమమున నిత్యమానెడుసెయ్యి పోయంగలవాండు శ్రీ శ్రీ శ్రీంచేయును.

3 యెల్లమందశాసనము

తిమ్మరాజయ్య యాదాస్తు
శా.శ. ౧౭౪౩-క్రీ.శ.౧౮౨౧

---

సూర్యుడు చంద్రుడు

స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు౧౭౪౩అగు నేటిరాక్షసంవత్సర శ్రావణబ॥౧౧గురువారం శ్రీమద్రాజాధి రాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివ మహారాజులంగారువిద్యానగరమందు రత్నసింహాసనాసీనుడయి పృథ్వీసామ్రాజ్యము చేయుచుండగాను శ్రీ కున్నమానుండదేశ్వర యెర్రంతిగునుల రాజయ్య దేవమహలాజయ్య చక్రవర్తి శ్రీరాజా తిమ్మరాజయ్యగారు కొండవీటిసీమలో యల్లమంద గ్రామాన బంధగావించిపాలించి నవధరించిన కట్టడిప్రకారం గ్రామానకాపురంన్న వారికి పూర్వక్రమం సమస్తకులోదరోధ్యం అయం రేయుఠంబళ్ళ బెట్టినారు అప్రకారాన నడిపించువారుం గ్రామాననుండి వెంచివెళ్లిపోయినవారు తిరుగాగ్రామానకువొచ్చి యిందుఅపూర్వానబెట్టిన రోఖ్యం గద్యాణంలోను సగమంటుసంగము నడుపువారుం యీరీతిగా పరస్థలంవారు మున్నూరుకాపులు రెడ్డికాపులు కోమట్లు, సాలెవారు తోగటివారు, జాండ్రవారు మొదలయినవారు పేటలోనుంచి కాపురంవొచ్చేయందుకు మూడేండ్లయీనడుటను పన్నులుఆయాలు పుత్తోగాన యిచ్చివారము.

(విస్తారభీతిని కడమపంక్తులువిడువబడినవి. ఇవి మెకంజీఇలియొటుగార్ల కైఫీయతులలో నకళ్ళు వ్రాయబడియున్నవి. ఇంకను ఇతర శాసనాధారములుగలవు.)

ఇట్లు
మున్నూరుకాపు పూర్వచరిత్ర
పరిశోధకమండలి.
హైదరాబాదు.

---

## గాంధిమహాత్మునితో

హిందూమహాసభకార్యదర్శి సంభాషణ

వార్ధా, ఫిబ్రవరి ౧౭

అఖిలభారత హిందూమహాసభప్రధానకార్యదర్శి డాక్టరు వరదరాజులునాయుడుగారు నేడు సేవాగ్రామంలో గాంధిమహాత్మునితో దేశంలో కలిగినరాజకీయప్రతిష్టంభనమును తొలగించుటను గురించి ఒకగంటసేపుమాట్లాడిరి. నాయుడుగారు కొన్నిసూచనలుచేసిరి. నాయుడుగారు వి.డి సావర్కారుగారితో మాట్లాడెదరు తరువాత ఆరుచునాపల్లివెళ్లి అక్కడచెరసాలలోవున్న సి. రాజగోపాలాచారిగారితో మాట్లాడుదురు. ఆచారిగారితోమాట్లాడినతరువాత నాయుడుగారు మరలసేవాగ్రామంవెళ్లి మహాత్మునితో మాట్లాడుదురు. ఇపుడు నాయుడుగారు మహాత్మునికీక్రిందివిషయాలను తెలియజేసినారట:

అన్నిరాష్ట్రాలలోను ఇప్పటుప్రధానమంత్రులుగావున్నవారిని వెనుకప్రధానమంత్రులుగావుండిన కాంగ్రెసునాయకులను, హిందూమహాసభ, ముస్లింలీగు సిక్కుసంఘము క్రైస్తవసంఘం మొదలైనసంఘాల ప్రతినిధులను ఇండియాప్రభుత్వమువారాహ్వానించి ఒకసభనుజరపవలెను. ప్రస్తుతంఏర్పడిన ప్రతిష్టంభనమును తొలగించుటకు సభవారొకవిధానమును సిద్ధపరచవలెను. యుద్ధముముగిసేవరకు కేంద్రములోను రాష్ట్రాలలోను మంత్రివర్గాల నేర్పరచుటను గురించికూడ యీసభవారొకవిధానమును సిద్ధపరచవలెను ఈవిధానమును బ్రిటిషుప్రభుత్వం అంగీకరించవలెను. మీరుకోరినస్వాతంత్ర్యమును మీకిత్తురని తోచుచున్నది. అప్పుడు అహింసవిషయంలో గట్టిపట్టుదలగలవారందరును తటస్థులుగా వుండవలెను—యుద్ధంముగియువరకు మతాలకు, సంఘాలకు, రాష్ట్రాలకు సంబంధించినవిషయాలను తలపెట్టగూడదు.

బ్రిటిషు కార్యసంఘసభ్యులసంఖ్యను హెచ్చించుటకు ప్రతిరాష్ట్రీయప్రభుత్వము కొంతమందిపేర్లనుసూచించవలెను- ఒక్కొక్క రాష్ట్రమువారు పంపినజాబితాలోను యొకరినొకరిని బ్రిటిషు తమకార్యనిర్వాహకసంఘములో సభ్యునిగ నియమించవలెను హిందూమహాసభ ముస్లింలీగు సిక్కుసంఘం నిమ్నజాతిసంఘం యీసంఘాలకు ఒక్కొక్కప్రతినిధిని తనకార్యనిర్వాహకసంఘములో రాజప్రతినిధి నియమించవలెను- బ్రిటిషుకార్యనిర్వాహకసంఘంలో రాజప్రతినిధి నియమించవలెను- బ్రిటిషుకార్యనిర్వాహకసంఘంలో అనధికారసభ్యులు ౧౫ మందివుండవలెను ఇందుకుప్రభుత్వంవారంగీకరిస్తే యుద్ధంముగిసేవరకు యీభారతప్రభుత్వం భారతశాసనసభలకు బాధ్యంగావుండనవసరంలేదు. ప్రతిరాష్ట్రంలోను కూటా యిట్లేపార్టీలతో సంబంధంలేని ప్రభుత్వసంఘాలుఏర్పడవలెను. ఇతరపార్టీలనుంచిన్నీ యితరసంఘాలనుంచిన్నీ మంత్రులనునియమించువిషయంలో అధికసంఖ్యాక సంఘమువారి అభిప్రాయమును తెలుసుకొనుటకు ప్రభుత్వముఅంగీకరించేయెడల ఈ సూచనలకుఅధికసంఖ్యాకపక్షాలవారు అంగీకరించవలెను.

యుద్ధంముగిసినతరువాత యిండియాలో స్వరాజ్యంలేక, బాధ్యతాయుతపరిపాలనం యేర్పరుచబడును. బ్రిటిషువెంటనే ఒకప్రకటన చేయవలెను. ఇండియాలోని వివిధపార్టీలనాయకులుకలిసి ఇండియాకుతగినరాజ్యాంగవిధానమును సిద్ధపరచవలెను.

---





Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A B.L.